పిమ్మట, గృష్ణరాయ పృథివీపతి చంద్రుని అంత్యశాస్త్రి ప
త్రమ్మున, దత్సహోదరు డుధారుడు అచ్యుతరాయ,లాంధ్రరా
జ్యమ్మున కెల్ల రా జయి ప్రజా పరి పాలన సేయ బూనె సా
ఖ్యమ్ముగ; శ్యాలకుండు, సచి వాగ్రణి పీఠ మలంకరింపగన్.

ఈతడు గూడ, శాత్రవ మహీశుల నెల్లర నొంచి బాసకుం
గైతకు బోషకుం డయి అఖండముగా వెలిగెన్, దెలుంగు భూ
మీతల రాజ్య మేలి; అటుమీద, గుమారుడు వేంకటాద్రి త
న్మాతుల రక్షకత్వమున, క్ష్మాతల భారము పూనె; జౌదలన్.

# విప్లవశ్రీ

సలక వంశ్యుడు, తిమ్మ రాజ ప్రధాని
సలుపు దారుణ కృత్యముల్ సైప జాల;
మైన, మా మాట కేమి; ఆం ధ్రాభ్యుదయమొ,
మడియు కాలమ్ము వచ్చె; రామ క్షితీంద్ర!

విందు నెపమ్మునన్ బిలిచి విప్లవ మందున జేర లే దటం
చెం,దరినో వజీరులను, ఏచి కనుల్ పెరికించె రాజ్యగ
ర్వాంధత; చెప్ప నేల? ఇపు డాతని దుర్నయ వృత్తి, కేవల
గ్రంధిత వాక్కు లన్; బలు తెరంగుల, దుష్టు డతండు; భూపతీ!

చంపించెనా, లేక? సార్వభౌముడు, వేంక
టాద్రి భూపతిని; సాహసము బూని
పొలివుచ్చెనా, లేక? భూపాలు పినతండ్రి,
రంగ క్షితీంద్రు; నిరంకుశముగ
కీడ్పరచెన, లేక? కేవల సోదరి,
వరదాంబికను; ప్రేమపాశ మొదలి
ఆక్రమించెన, లేక? అన్యాయముగ, అఖం
డాంధ్ర సామ్రాజ్యంపు హక్కు; లడరి

అంత లంతలు సేసిన, అతని; కింక,
మాదృశు లనంగ ఎంత? సామ్రాజ్య మెల్ల
నామ మాత్రమ్ము కాగల; దో మహీంద్ర!
నీవు జృంభించి వాని దండించు వేని.

సామాన్యుండవె నీవు? సర్వ జగతీ సామ్రాజ్య ధౌరేయ సం
జ్ఞా మా లోల్లసితుండ; నీ వసలు, ప్రస్థానించినన్ శత్రు భూ
ప్వాముల్ లొంగక పోరు; నీ కపుడు, నీ సామర్థ్యమున్ మెచ్చియే
భూపాలేంద్రుం డల కృష్ణరాయలిడె, దత్పుత్రిన్; మహీశాగ్రణీ!

అనుచు సామ్రాజ్య సామంత మనుజ నాథు
లంద రొకటయి పలికిన, ఆలకించి;
ఎంతలో, ఎంత మార్పు వహించె ఆంధ్ర
రాజ్య, మని బాధ పడె నాడు; రామ నృపతి

పలుకము మంత్రి, ఆఖరకు జల్పెడి దిట్టిద యంచు, నాడె ఆ
కలితము చేసి కొంటి; అది కన్నులగట్టిన యట్లు సర్వముఁ
బొలిచిన దిప్పు; డా చెనటి బూర్తిగ నాశనముఁ బొనర్చి పెం
పలరగ జేయవచ్చు నిపుడైనను; ఆంధ్ర మహీ ప్రభుత్వముల్

మరచితి, మాటల ధోరణిఁ;
ధరణిపు బినతండ్రి సుతు, సదాశివు, ధాత్రీ
శ్వరు నొనరింపగ వలె; ఆ
చిరుతకు సేమంబ కద? వచింపుడు; ధీరుల్

క్రూరుడు వాడు, సుంతయును కొంకక యే తులువా స్వయం బనా
ధార మొనర్చు చున్న తరి, దైవ వశంబున జిక్కి యుండ, ఆ
ధీరుడు, ప్రోలు వీడి పర తెంచి నటుల్ వినియుంటి; ధాత్రికిన్

అని రామ క్షితి నాథుఁడు
కనుకని పృచ్ఛింప పొంగి తన్మానసు లెల్లన్
"జనపతీ! అతని వాసము
కనవలె; సేమంబ అతఁడు గావలె;" ననినన్

అతని వాసమ్ము ము న్నెందు అరయ వలయు
అని త దన్వేష ణామునకు బనిచె నగిన
తెరువరుల రాజు; పదప, ఆ దిట్టలేగి
సర్వ మారసి వచ్చి విజ్ఞప్తి సేయ

రామ రాయలు, తక్కటి రాజు లపుడు
వెంట రా, సదాశివు డున్న పృథ్వి కరిగి
అతఁడు దోతెంచ, కుశలమ్ము లడిగి అడిగి
కుదకు ఇట్లనె; ప్రేమ యొంతో దలిర్ప

నందల యొండ్లు నుండి అతి వైభవ మేది అఖండ కీర్తి వృ
ద్ధిం దయివార, ఇం దనుక పెంపు వహించిన దీ తెలుంగు రా
జ్యేందిర; అట్టి, ది గ్జైత్ర నికృష్టుని మూలమునన్ దిరోహితం
బందగ నున్న, దీవు తగు నట్లు చరింపవ యేని; అర్భకా!

ఈ సమయంబునన్, ధరణి యెల్ల శిరంబున దాల్చి; విశ్వవ
శ్రానకు వైదేశ సల్కము ప్రధానిని బూర్తిగ బొల్చుచూ; ర్నిమూ
మా నకలైక బాధలను, మాన్పవ? యుం చిపు డర్థి గోర ని
జేసిన నిను ... ఈ సుమతి సేమము లెల్ల సదాశివ ప్రభూ!

ఆతడు సమ్మతిన్ దెలిపె, అందుల; కంతట, ఆ క్షణంబ వా
రాతని కాంధ్రరాజ్య మది యంతయు బట్టము గట్టి, రంచిత
శ్రీ తనరార దైవ గృహసీమ; అనంతర, మామహాంధ్ర పృ
థ్వీతల చక్రవర్తికి నతి ప్రణుతుల్ పొనరించి; రందరున్.

అపుడు, సదాశివప్రభువు సల్లన వోడొక్కని గుత్తిదుర్గ మం
ద పరిమితంబుగా బలము లాతని రక్షణ నిల్పి యుంచి శ
త్రువ్యపనయ భావికాల సమరంబునకుం దగు యత్న మెల్ల, ని
శ్చపలత బూర్తి చేసికొని సంగరముం బ్రకటించె; పర్వడన్.

ఆంధ్రవీర! కదనభేరి,
ఎగసి మ్రోగ జేయ వోయి!

దిక్కు లెల్ల ఒక్క పెట్ట
జలదరింప జేయ వోయి!

రిపుల ఉడుకు నెత్తుట, బడి
తొప్పదోగి ఈద వోయి!

విప్లవకరు, రూపు మాపి
తెలుగు శోభ, నిలుప వోయి!

సమర భూమి, నృత్య మాడి
అమల యశము, దోసకు మోయి!

పద పద ఇక, తెనుగు తనయ!

అనుచు, ఉడుకు నెత్తు రాత్మయం దంతట
జల జల మని పొంగి జాలువార,
సమరగీతి పాడి సర్వారా ష్ట్రసేనతో
కదలి వెడలె అనికి; క్ష్మావిభుండు.

బహమనీ రాజు లేవురు వచ్చి సాయ
మీయ, సల్కము మంత్రి వారించె, రాజ్య
ఘాని కీ వలి భూముల, దండు; నంత,
బెరిగె; ఇరువాగు నందున బెద్ద పోరు.

బవరం బా విధి, రెండు పక్షముల దీవ్రవ్యాప్తిని సాగు చుం
డ, వదాన్యుం డగు రామరాయుని ప్రచండ స్ఫీత దోశ్శక్తి, వి
ప్లవకారుం డరిగెన్ దివంబునకు; ఆపై, భామినీ రాజు లా
అవనిన్ వీడ్కొని పారజొచ్చిరి; భయ వ్యాలోల చిత్తమ్ములన్.

అది కని, కొంత సైన్యము రయంబున వారల నిల్వరింపగా
మొదలుగ బంపి; పిమ్మట, అమోఘముగా బుర వాసు లందరున్
ఎదురుకొనంగ, గేంద్ర నగరీంద్రము జొచ్చియు, అత్త లాదిగా
బొదలు నిజాప్త వర్గమును, బూన్చె నతం; డధిక ప్రహర్షతన్.

తడయక, వెంటనే తెలుగు ధాత్రిపునిన్ గొనివచ్చి బాంధవుల్
పుడమి పతుల్, సు ప్రాజ్ఞులు, ముఖ్యులు, లోనగు వారలెల్ల దం
డడి సభ నిండియుండ, వసుధాపతి జేసె నతండు వెండియున్;
గడలె సమస్త రాజ్యము అఖండముగా అపు; డాత్మ రోచులన్.

పదపడి, శాత్రవ శేషము
దుద ముట్టగ జేయవలయు దోన య టంచుఁ
మది బరికించి యొనర్చెను
కదనపు టేర్పాటు లెల్ల, క్ష్మావిభు; డంతన్.

బీదరు బీజపూర్పతుల పీచమడంచగ, గొంత సేనతో
సోదరు వేంకటాద్రిని, బ్రచోదితునిఁ బొనరించి; అహ్మదా
బాదు నృపాలు నొంచి ఎడపఁ, బెద తమ్ముని దిర్మలప్రభున్
జోదు, నొ కింత సైన్య మిడి జోకదలిర్పగ బుచ్చి; పిమ్మటఁ,
తక్కుంగల సేనల, దా
నొక్కఁడు, గోల్కొండ నృపతి నొంచి మ హాజన్
జిక్కఁగ జేయఁ, దిక్కులు
దిక్కరి కంపింప, రామధీరుం డేగన్.

ముగ్గురు యోధు, లజ్జగసి పోయిరిపు ప్రభు ధైర్య సంపదల్
నుగ్గయి క్రుంగు దాక, కద నోర్వర వీరవిహార మేలి పే
ర గ్గల మై రుచింప, విజయమ్ము గ్రహించి స్వ రాజ ధానికిన్
దిగ్గన గ్రమ్మరిల్లిరి; అదే పనిగా, రిపు లోడి మ్రొక్కఁగన్.

అసదృశమైన దిగ్విజయ మంది, మహోదయ మెల్ల ఒక్కటై
ఎసగి ముఖమ్ములన్ బొటకరింపగ, ఆంధ్ర పురీమ తల్లి సం
తసమున మున్గి తేలుచు గృతజ్ఞత దెల్పెను, స్వాగ తోత్సవ
ప్రసవ సముచ్చయమ్ముల; అపార బలాఢ్యులు వారిక దరిన్.

# సమరశ్రీ

సర్వ తంత్ర స్వతంత్రత, సార్వభౌమ
ప్రతినిధిగ నుండి సకల సామ్రాజ్య కార్య
ములను, నెరపుచు ప్రఖ్యాతి కలిగి యుండె
రామప్రతినిధి, ఆర్వీటి రాము: డప్పుడు.

బహమిని రాజు లెల్ల, దన పల్కిన పల్కుల బాటలన్ భయా
వహత జరింపు చుండ; నని వార్య భుజోద్ధతి, సింహళాంత మా
మహీ సకలమ్ము నాదినృపమౌళికి గూర్చుచు, రామరాట్ప్రభుం
డిహ పర కీర్తి దీప్తి సాధించెను నా: డె నలేని క్రైవడిన్.

ఆ గతి రాజ్య పాలనము హాయిగ సాగుచు నుండగా, అసూ
యాగతులై తురుష్క నృపులై దుగు: "రాంధ్ర ప్రభుత్వ వైభవం
బీగుట జూచి విందు లానదించెడి ఆ శుభ వాసర ప్రభా
భ్యాగతి ఎన్నడో" గద, అటంచు తలంచెడి వార; లాత్మలన్.

ఉరక కన్నెర్రయే కాని, ఒంటి నృపతి
ఎంతబలవంతు డైన, దిగంత దీప్తి
మల్లడించెడు ఆంధ్రసామ్రాజ్యు నెదిరి
పొలయ లే డని, ఎరుగక పోరు; వారు.

ఏవురు ఏకమైనను, జయింపగ రానిద సర్వ సంప దా
భావృత మాంధ్ర రాష్ట్ర పరిపక్వ మహోదయ మంచు గూడ, సం
భావన చేసియే అనికి బన్నిరి వా: రొక వేళ, మాకు ఆ
దైవమె తోడు వచ్చు నెడ, తప్పదు గెల్పను నిశ్చయంబునన్.

కాని, మాలోన మాకు ఏ కరణి నైన,
ఆత్మ కలహమ్ము లుడిగి సర్వైక మత్య
మొలయ వలె ముందు; దానికి, వలయు సకల
యత్న సిద్ధిని సాధించు; టవసరమ్ము.

అని, విచారించి తొంటి పోట్లాట లుడిగి
యేక మైనారు తురక ధాత్రీంద్రు లపుడు;
అంత, వినిపించె ఆంధ్ర రాట్స్వాంత మునకు
ఆ యుదంతము; చార దృగ్వ్యాప్తి నొలసి.

తెలిసిన వెంటనే వసుమతీశ్వరు, డోలగమ్ము రచించి శ
త్రుల దెగటార్చు మంత్రవృషధోరణినుండగ: ధాత్రియంతయున్
దలపడ వచ్చినన్, దెనుగు ధాత్రికి ఓటమి యన్న మాట, ద
వ్వులనె రహించు నెప్పుడు; ప్రభూ! రిపుదుర్జయు;లాంధ్రధీవరుల్.

అని, గంభీరత రామరాయ లనగా, ఔనౌ నటంచా సభా
ఘును లెల్లన్ దలలూపి; రాత్మ మురిసెన్ క్ష్మాభర్త; ఆపైన, దో
డనె రాజాజ్ఞలు కండ్ల నద్దుకొని తోడై వచ్చి, రా సింహ ఘో
షన వింధ్యాద్రి పరీత భూపతు; లసంఖ్యానీకినీ పంక్తులన్.

అపుడు, రారాజు ప్రతినిధి యైన రామ
రాయల కొసంగె, అల సంపరాయ కార్య
నిర్వహణ బాధ్యతను నెల్ల నెట్టనముగ;

గడచెను కొంత కాల మటు; కన్పడె బిమ్మట, కృష్ణ కావలన్
వెడ వెడ శత్రు సైనిక నివేశన భూములు; తెల్గుజోదు ల
గ్గడి విషయంబులన్నియును, గన్నవి గన్నయటుల్, స్వయమ్ముగా
బడయని కేర్పడన్ దెలిపి; రుజ్జ్వల వాగ్రచనా చమత్కృతిన్.

ఏపు గొలంది, తమ్ములకు ఇర్వుర, కాంధ్ర చమూ పతిత్వముల్
జేపడ జేసి: ఏగు, డని చేయుడు, సాహస ముప్పతిల్ల; ఈ
లోపల, నేను గూడ త్వరలో బలముల్ సమకూర్చి మీకు దో
డ్పై పయనించెదన్; రిపు భయంకరు లార! జయమ్ము గావుతన్.

అని రామరాయ లనగా;
అనుజుడు, కేలు మోడ్చి తిరుమలాఖ్యుడు, వినయం
బెనయగ: వృద్ధులు మీరలు;
అని జేరగ వలవ; దన్న! అని ప్రార్థించెన్.

ఇది యొక యుద్ధమా? అన; లక్షీణ బలాఢ్యుడు రామరాజటం
చిదివర కైన పోరుల గ్రహించియు; నేడిటు, మీర లాత్మలం
దుదిలకొనన్ సమంజసమె? ఊరక; వృద్ధుడనైననాడు, నా
ఎదుట నెదిర్చి ఎవ్వడు రహించునో; తెల్పగదోయి, తమ్ముడా!

తమ్ముడ వాట సాజమె, ఎదన్ భయమొందుట; కాని, సర్వలో
కమ్ముల బేరు గాంచిన అఖండ బలాఢ్యుడు, రామరాయలే
ఇన్నేండ్లు బోరితంబున జరింపక యుండిన; ఆంధ్ర కీర్తి భా
సమ్ము దిశ క్ష్మాపాలురకు సొంతము లోకువ కాదె? తమ్ముడా

అదియును, నిన్న మొన్న వర కాత్మ పదస్థలి, వంగి వంగి నె
న్నుదురున జేయి సోకగ, అనూన విధేయత సంచరించు; ఈ
అధిపతులా? మహాంధ్ర వసుధా భరణుం డని పేరు గొన్న న
న్కడ్డనములో ఎదుర్కొని ముఖా ముఖి నిల్చెడి బంట్లు;సోదరా!

ఇపుడు వృద్ధుడ నని బెగ్గడిల్లు నీవ;
కొదమ సింగమ్ము చాడ్పున, కదనరంగ
మందు గుప్పించి యెగసి పరాళి రేపు
ఇతడె చక్కాడు చుండ; హర్షింపగలవు.

అగ్రజు డిట్లు పేర్చి బదు లాడిన వెంటనె, సంపరాయ సా
మగ్రిని వెంట నుంచుకొని: మంచిది, మే మిక పోయి వత్తు; మం
చుగ్ర తళ త్తళల్ నొసల నుయ్యేల లూగుచు సందగింప, యో
ధాగ్రము లైన, వారు సమ రావనికిన్ జని రప్పు; డిర్వురున్.

అరులు, తెగబడి ఉత్తర మందు విడియ;
విడిసి రాంధ్రులు, దక్షిణ పృధ్వియందు;
ఉభయ సేనల మధ్య, దృక్సుభగగతుల
పారు చుండెను, కృష్ణా స్రవంతి; నాడు.

పలు మొసకంబు లేచి పెరవా రటు ఆవలి యొడ్డు దాటి ఈ
వలి కరుదెంచ కుండ, అతిభద్రతమై బచరించినార లాం
ధ్రు; లి కపు, డే యుపాయమును దోచమి అల్లైవసించియుండి,రు

షుదకు, మా యోపవస్ పార్శ్వర్ఛవించె
యువన జీమూత యత్న ప్రయాణామునకు
ఆంధ్ర సేనాను, లదియును ఆకళించి
గట్టు కావలి కెట్టించి కాచి; రఘుడు.

నడువర, వీరా!
జయ జయ నాదా
ర్భటు లెనయంగా;
రణ చర భేరీ
అదిలిచి కొట్టే,
పదర; తెలంగా
ణపు రణ వీరా!

సమయ మిదే—రా,
సమర విజేతా!
పలుకర, జాతీ
యపు రణ గీతుల్
అరుల మనస్సుల్
భయపడులాగూ;

"సలుపర, రారా!
కదన విహారం

రణభువి నంతా,
అలుకర; ఆంధ్రా!
రిపు నవ రక్తాం
బువులను; లేరా

రిపు కుల కంకా
ణములను మ్రుగ్గుల్,
నలుపర; రారా—
కదన విహారీ!

కడగర, ఖడ్గం
బుల నల కృష్ణా
నది; జయ మందీ

వెనుకటి దేశా
భ్యుదయ యశస్సుల్,
నిలుపర; లేరా,
భరత కుమారా!

అనెడి ర ణావనీ తల ప్రయాణ నిరూపక వీర గీతికా
ధ్వనులు, దిగంత రాశముల ప్రచ్చి ప్రతిధ్వని సందడించె; ఆ
నినదములోన, అపుడ జనించెనో అన్నట్టు, లాజి భూతలం

అప్పటికె, శత్రుం లీసలి కదుగుదెంచి,
రతుల నూ యోప మార్గ సంగతుల జెలగి;
అది న ఋక్షించి రాను రా, జైన నేమి
చేయ గల? రని పాంపిరినా యె; నచట.

పలికరాక కప్పు, డుబుకెత్తు కదుష్ణ తను ప్రకీర్ణ ప్రో
స్ఖలిత రక్త నిర్గతి అమేయ రవార్భటిబొర్లి పారె; దా
జాలయి, పాయలై, అలల సంకులతన్ బెన పెద్ద వాహినీ
జాలము లై, త్రిలింగ కుల సైనిక నాశ సమస్త గహ్వారిన్.

అదె, సమరోదయమ్ము మొదలయ్యె చమూయుగ వీధి; శ్రోత్ర హృ
ద్భిదధిక దుంధుభీ రవళి దిక్తటముల్ పెకలించె, తన్నదీ
సదమల వాస్తరంగముల సందడిలో ప్రవిలీనమై; సమి
ద్బుధుల శ్రవః పథమ్ముల కపూర్వ మనోజ్ఞత పోషణించుచున్.

కాలము కడచిన కొలదిని,
ఆలము నల్గడల బెద్ద దయి జృంభించెన్;
వీగుచు, వర్చిచ్చుచు, సేనా
జాలము హావణించె నాడు; సమర శ్రీలన్.

పర బల వీధి నేచి చొరబారుచు, నాడు తెలుంగు సేన ని
ర్వైరగున జూపరం దిగిచి వీర విహారము చేయు చుండగా;
పరచిరి, తాళ్మి గోల్పడిరి, పల్మరు గెల్పిక సున్న యంచు, బి
కొరవి, విశ్రాంతి వొందిరి; అయోమయము లెరి, దురాన శాత్రవుల్.

పది పదునేను లక్షల అపార బలంబున, యుద్ధ భూమిలో
పొదలు మహాంధ్ర సైన్యపుల ముందర; నిల్వ గలట్టి జోదులా?
మది బరికింప ఈ నృపతి మాత్రులు; సుంతయు దూరదృష్టి లే
క, దిగుదురా? వివేకమును గల్గిన వా; రిటువంటి పోరులన్.

అనుచు, అవలోకి జనులు తీ దాహవమున
నాటి శాత్రవ వీరుల పాటు గాంచి
హృదయ సౌ ఖ్యాంత ముల విహరింప సాగి
నారు పలుమార్లు; తమలోన దాము నాడు.

తెనుగు పటాలముల్, తనివి తీరని శూరత నట్టు లాజిలో
చెనగి చెనంగి శాత్రవుల భీతికి దావల మాట; రామ రా
యనిహృదయప్రపూర్ణసభయందు, ప్రమోదపు దావులన్నియున్
దనిసి ఉపన్యసించిన విశాలకు, హద్దులె లే; వ వెట్టివో!

ముమ్మరమై, స్వకీయ తనుభూ ప్రదరంబున నున్న నాళ నా
ళమ్ముల జాలువారు, బహుళ ప్రమదంబుల; జొక్కి ఆజి మ
ధ్యమ్మున గొల్వు దీర్చి గెలుపందిన బంటుల జేరి ద్రవ్య దా
నమ్ముల, రామరాయ లలనా డోనరింపగ సాగె; హృష్టులన్

ఆ తరుణమ్మునందు, అత డాదట ఎవ్వరి నమ్మి అంగ ర
క్షాతల మందు నిల్పుకొన గల్గెనో; ఆ యవనీయ జాతి సం
జాత చమూపతుల్, వృజిన సాధ్వస మింతయు లేక, వంచనా

కంచెయే పైన గబళించు కడక నున్న,
గావ శక్యంబె? ఏలాటి కాపు కైన;
తీసి పోసిది కలహమ్ము బూని, వారు
తిరుగబడి, రిర్వురును; దను దేవు నెదిరి

ఎంత బలాఢ్యు డైన, మరి ఎంతటి సాహసి యైన, ఒక్క, డే
కాంతము నం ద మాంతముగ అందరు ఒక్కటియై పయిన్ బడన్
స్వాంతము చిక్కబట్టి అని జల్పిన జల్పగవచ్చు; గాని, యు
ద్ధాంతమునన్ బరాజయము దక్కొన దప్పుని యే; ఫలంబగున్.

అప్పటికి గూడ, రామరాయ ప్రధాని
జాగ రూకత బచరింప సాగె; గాని,
ఆంధ్ర శిరముల, దాస్య పురంధ్రి జాడ
ల గపడిన వప్పటికి; స్వాత్మ, నతని కపుడు.

అంత ర్విప్లవ, మీ ప
ఝాంతమునం దుదయమందు; అన్యోడమే లా
వంతయు ఒలయదు, నమ రా
భ్యంతరమున; ఒలయు నేని, అది దైవికమే.

చివరకు, సైన్యపాలకులు చేసిన సేతల మోసపోయి; మం
ది. వలను గల్గు త్రాచు పలుచీమల దాడి మలంగి వత్తలై
చివికి లభించు కైపున, మషీకృత సర్వ ప్రతీప ధైర్యవై

ఒకమారు తమ కల హార్ద్యోగముల నిల్పి
పేచీలు తీర్చిన పెద్ద మనిషి
ఒకపరి సంగ్రామ నికటమ్ములఁ దమ్ము
తరిమి చదిపిన యోధ స్వారోచి
ఒకనాడు తాము పే రోలగమ్మున నలా
మన శిఖి దల యూపి నట్టి ప్రభువు
ఒకవేళ జెడి "కావు మో తండ్రి" యన దను
కిల గూర్చి నట్టి మహీశ్వరుండు

వధ్యుడై నాడు నే డంతివాడు; రిపుల
క క్కటా! కాల పరిణామ మందు, నెవ్వ
రెవ్వ రగుదురో; విధి సేత లెరుగ నగునె?
ప్రాయికమ్ముగ, ఎంత వలంతి కైన.

అప్పటి కైన, ఆంధ్రుల బలాధికతల్ తరు గొంప లేదు; తెం
దెప్పలుగా రణేచ్ఛయు, ప్రతీక్ష నెలర్చె; జయంపు టాళి యో
చొప్పడ దామె, ఆ తురక జోదులకున్; దెలుగుం బతాక గో
టె ప్పటి యట్ల శౌర్యకళ లింపెసలారగ, గ్రుమ్మరించుటన్.

కాని, బహు కాలమున నుండి కసటు లేని
స్వైరమున గల రుచి, వెక్కసమ్ము కాగ
జూచి; యిక, బాలి శతలోని వాచవియును

తిరుమల దేవరాయలు ప్రతీప భయంకరు, డగ్రజుం డటుల్
మురియుట జేసి, ముందటి ప్రపూర్ణ రణేచ్ఛ నిరాశ గొల్ప సం
గరముద్యజించె; దాలిమి పొకాలె; మనస్సు చలించె; అంత, అం
కురితము లయ్యె వానికి బ్రసోప ప్రపంచ విరక్తి భావముల్.

ఎట్టి సమర్థుడైన, దన వెలిక నిల్చిన గాక, ముందుగా
గిట్టిన, జోక యంతయును గీడ్పడ జెంగు, బయిన్ విరక్తుడై
ఇట్టె త్యజించు సర్వ; మిదియే కద, సైందవ భంగి; కాని చో
పట్టునె? దాన్యపుంగతి, ప్రపంచ ప్రభుత్వ సమాత్త భూమికిన్.

తిరుమలరాయలే అటు లదే పనిగా జన కున్న, ఆంధ్రి పుం
గరకరి ఎంతమట్టుకు జగాన రహించునొ జోక లేన్నిదై
ఎరుగ దరంబె? ఎంతటి అహీన వివేకినైన; కాని, ఆ
ఖ రయిన దేవము, నాటి కధికార మహోదశ; తెన్ను గడ్డకున్.

అటు లవలీలగా, దమ యు పాంతములం దొర పేదు వైఖరిన్
బొట బొట కంటినీటి చిరుబొట్లు చనుంగవ జిందువందగా
అటమట బొల్చెనొ క్కమొయి. ఆంధ్రమహోత్కట రాజ్యలక్ష్మి; నె
త్తుటి మయమైన, ఆ హృదయ తోయజ భీకర సంగ రావనిన్.

సలసల గ్రాగుచున్న పెలుచన్ "సమయం బిదె" యంచు, బెక్కు బా
సల గసి తీరగా గసిమసంగిరి: పిల్లలు, వృద్ధు, లేమియున్
దెలియని పాప, లంగనలు, దిక్కరు, లం చనుకంప లేక, ఆం

ఘనతమున గల్గు పట్టుదల మూని, అటుల్ గయికొన్న ఆంధ్రభా
రత ధరణీ ప్రభుత్వము, శిరంబుల దా మవు దేవురున్ వహిం
చి తనరిన, బ్రపంచ ప్రథ పొంది వెలింగిన నాటి తెన్గు సం
స్కృతి, కలకాలమున్ బృథివి నేలుకొనున్ గద; దీటులేనిదై.

నిజమునకు అట్టిదే; కాని, నెమకి నెమకి
కాల్చి వైచెను, వారి మూర్ఖంపు కోప
శిఖి శిఖా జ్వాల; దాని ససిబు, నాటి
కంత మైనది; ఎవరి నేమనగ వలయు?

వారిలో వారి ఐకభావమ్ము లేమి
వదలి పోయిరి, తమకు జేవలతి యైన
ఆంధ్ర సామ్రాజ్య ప్రాజ్య సింహాసనమ్ము
నధికు శాత్రవు లెవ్వరు; నెదల బొంగిరి.

# పీర్ష శ్రీ

నిన్న మొన్న వరకు, ఎన లేని సిరి సంప
దలను ముద్దు లొలుకు నిలయ; మిప్పుడు
తెమలి మట్టి మయ్యె, దిక్కు దివాణమ్ము
లేక; ఇదియ! బ్రహ్మ లేఖ నమ్మ.

సురపురి జేర బోయి; తడి చూచి భవత్సహ జన్ముడైన ఆ
తిరుమలు డేగి ఎచ్చటికో; దిక్కుల నెల్ల నిరంతరమ్ముగా
వరలిన తెన్గు కత, ఇక ప్రాభవమున్ వెలిబెట్టి సొంత కా
పురమును జంగ బెట్టుకొని పోవలయున్ గద ఏడకో; విభూ!

అంచిత ప్రేమమై, అధికు లందరి ముంగట, నన్ను గొప్పగా
గాంచితి వంత్యవేళ దనుకన్; సుర సామజ ఘోటకమ్ము లి
ప్పించి విభూ! బొనర్చితివి; ఇంతకు, నీ కొర గ్రంథమేని అ
ర్పించుట లేక పోయితి; మహీపతి! నీ తను వున్న రోజులన్.

తగ్గనే లేదింత దనుక ఈ మెడ నీవు వైచిన సుమమాల పరిమళమ్ము
మరువనే లేదింత మట్టు కెవ్వరు నాడు వెలగిన కనకాభిషేక గాథ
పట్టనే లే దింత వరకును సుఖనిద్ర పరిపంథులైన భూపతుల కెల్ల
దాటనే లే దింత దాక ఈ తొంటికర్ణముల నీ నాటి కంఠారవమ్ము

పాయనే లేదు నిక్క మిప్పటికి గూడ
కంటి కెలకుల భవ దమోఘ ప్రపంచ
గేయ గంభీర సుందరాకృతి; అదేమొ
ఎందు జూచిన నీవ కన్పింప; వధిప!

ఎవరికి ఏది శాశ్వతే? మనేకులు పాలన చేసినార లీ
భువనతలమ్ము; అం, దొక నృపుండును లేడిపు; డట్లె నీపునుం
దినము సలంకరించితి; వధీశ్వర! ప్రాణము లుండు దాక, శా
త్రవ కుల భీకరత్వమున రాజ్యము చేసి; సుజన్మ నీదె పో!

అని పలు కైపులన్ మది, మహాకవియౌ అల రామరాజ భూ
షణు, డపు డా మహా నగర సౌష్ఠవ దుర్గతి గన్నులార గ
న్గొని యొకమొండునన్ బొగిలె,గుండెగుభేల్మన; గుండెవెండియున్
గనుగవ గోష్ణ బాష్పములు కాల్వలుగట్టి స్రవింప; న త్తరిన్.

అకటా! దక్షిణ ప్రా క్ప్రతీచి త్రి దిశా వ్యాప్తాంబు రా శ్యాధిప
త్య కిరీటమ్ము వహించి క్రేణివడి త ద్వైశ్వర్య సంభూతి, నీ
సక లాశా పరివీత భూవలయ సంస్థానమ్ము నం; దట్టి నీ
కి, క ఆ జీవిక తెల్లవారె గద; తల్లీ! ఆంధ్ర విద్యా పురీ!

అనుపమ ద్రవ్య రాశుల నహ ర్నిశలుం దళు కొత్తు రేవు ప
త్తనములవర్తకమ్ము, బహుధా చెనకింప; "ప్రపంచమందు నా
కె న యగు పట్టణమ్ము మరి యొందును లే" దని చాటివిర్ర వీ
గిన, అల నాటి నీ హాయలు కీడ్పడి పోయె గదమ్మ! నేడిటుల్.

అతులి తైశ్వర్య శోభల నవఘళించు
నిన్ను, ఆనాటి పండు వెన్నెల దినాల
గనిన ఈ కన్నులే; నేడు కాంచ వలసి
వచ్చె, నీ పాడు దశయు; నా పాప మేమొ!

శ్రీనాథ కవిసార్వభౌమ దేని ప్రాణాల మున్గి
తేలిన ముత్యాల జాల యేది?
పిన వీరభద్రుఁ డెందు సృష్టించె సన్మాన
సంపద గొన్న ప్రాకార మేది?
జంట కవీశ్వరుల్ సార్వభౌముని యుపా
యనము లందిన సభాయతన మేది?
పెద్దనామాత్యుఁ డెందు సృష్టీశమూర్తి స
న్మానముల్ గాంచిన స్థాన మేది?

సార్వభౌముఁడు స్వర్ణపుష్పాల నన్ను
ఓలలార్చిన చమకంపు టుద్ది యేది?
కటకటా! తుద కెంతటి కష్టకాల
మావరించిన; దాంధ్ర విద్యా పురంబ!

చిన్నెలు వన్నెలుం దొలకఁ జేయుచు హాయిఁ బచరించు వేళ, నిన్
గన్నులు హర్ష కాంతి దనుకం గని పోయిన పెద్దనాది వి
ద్వన్నుత సత్కవీశ్వరులె ధన్యులు మెట్టుకు; నాకు బట్టె, నే
డన్నిట హానిఁ బడిన ఆత్మ పరీక్షణ; మెంత పాపినో!

అటు బీహారిటు సింహళమ్ము వరకుం వ్యాపించి పైకొన్న ప్రా
కట శౌర్యాంధ్ర మహీ ప్రభుత్వము నసంఖ్యాం బైనసంపత్తుతో
బటు దోశ్శక్తి ప్రపంచ మెల్ల బొగడన్ బాలించి పేర్వడ్డ నీ

నియ దుద్యాన వన పరిఘాణములలోఁ, విశ్వేక్షణ ప్రాప్తి ప్రా
ప్త్యయ సంప్రీతుల గ్రేల్లు దాఁటెడు లస త్సౌధాగ్ర కోటీర సం
చయముల్, బారులుతీర్చి చూడ్కులకు హర్షాశ్చర్యముల్ గొల్పు ఆ
అయ సంధాయి దినాలకున్; ఋణము నిర్యాతమ్ము కావచ్చునో!

దేవా! తిర్మలరాయ! అగ్రజుడు బొందెన్ బాసినన్, బాసె బో
సి వే మైత్రి, వధేద్య శూరుడవు? పోనీ, సైన్య మే మయ్యె? శే
వా, వైరి ప్రకరమ్ము ద్రెంచ గల శ స్త్రాస్త్రమ్ము? ల ట్లోహావ
శ్రీ విడన్ జనునా? స్వదేశము నశించెన్ గాదె; నీ శోకడన్.

అరయు దేరనట్టి సుతు డాహావ మధ్య శోకాలు వేళ; వా
చారియు, ద్రోల్లి, ఫల్గుణుడు సైచి రణం బొనరింపడే? జయ
శ్రీ రమణీ మణీ హృదయ సీమ గనుంగొను దాక; అంతకునే
మీరిన దుఃఖమా, ఇది? గమించిన వేమొ; తెలుంగుపుణ్యముల్,

నురచితి, ని స్సనం జనడు; మా లిఖితమ్ములె తీర్చి యున్న, సో
దర మృతి దుఃఖ నిష్ప్రహా కతమ్మున ఆజి దొలంగు నప్డు, ని
న్నరలిచి కర్మయోగపు క్రమం బుపదేశ మొసంగు నట్టి శ్రీ
హరి నను దెవ్వడైన ఒక్క డమ్మెడ బొల్చిరె యుండు; భూపతీ!

హరిహర రాయ లాదిగ, బరాంతక దక్షుడు రామరాయ భూ
వరమణి దాక ఉన్న బలవ జ్జన పాలుర తోడు నీడలన్
విరివిగ జావ్వరించి వలు పేటుల కవి పొలార్చ్చి; తట్టి సి
మురిపెపు గాల, మింక కనబోను గదా; నగ రావతంసమా!

ముందును వెన్క నందనపు భూముల పైరు, పసందు గొల్పుచుం
డం దళుకొత్తు మేడల విటంకములం; దొకయింత తాకినం
గందెడు నేమొ దేహపు వికాస మనం దగు రోవెలందుకల్
కందుక క్రీడ లాడ, గన గల్గిన ఆ సమయాలు; రా వికన్.

చూచుకొలంది, చూపులకు జుట్టరికం బెనయించు మాధురీ
రోచుల వెల్లిగొల్పెడి చెలుల్; వెనకో, న్దొరసాన్లతో దొరల్
పూచిన పూల దోటలకు బోయి తమిన్ బ్రమదైక దృష్టి దో
బూచుల నాడె,డా హరువు ప్రొద్దుల బో! భవదీయ యోగముల్

బాటల మధ్యమధ్య, బరిపాటిగ పర్వడి యున్న యట్టి శృం
గాటక మూలలందలి, దృగద్భుత నందన భూములందు; స
య్యాటల నాడె, డా మురిపె మైనను, పోవడ జేయలేద! క్రూ
రాటన దీక్ష, నిన్ను బయిరాగిని జల్పెడు నాడు; శత్రులన్.

ఈశులు, రాజకీయ పదవీశులు, సత్కవితా ప్రపంచ రా
జ్యేశులు, కవితోడ విహరించిన ఆ సొగసైన వీధు; ల
బ్బా! శవ భూత జంబుక నివాసము లైనవి నేటి కిట్లు; హృ
త్కోశపు గ్రంధు; లేపుచెడి క్రుంగెడు; అయ్యొవిచూచునంతకున్

అలనాడు సార్వభౌములు నడాడిన చోటు
లీ నాడు దెయ్యాల కిరవులయ్యె
అపుడు వారాంగన లాడి పాడిన చోట్ల
ఇపుడు ఫేరవగాన మెగయు చుండె

మునుపు శేరాణి వాసనల దోగిన మేడ
లీనాడు శవగంధ మీను చుండె
వెనుక రాచకుమారు లెనసి ఆడిన దొడ్ల
ఇపుడు రాబందులు ఎగురు చుండె.

మునుపు రాజాధిరాజులు పొంగలించి
సభలు దీర్చిన ముత్యాలశాల, ఇపుడు
ప్రేతనాథుని దర్బారు వీధి యయ్యె;
అబ్బ! గుండె పగులదె? ఏ ప్రాణి కైన.

ఇదియె కాబోలు, మం త్రీంద్రులు హావణించి
సిరు లొల్క జేయు కచేరిసాల
అదియె కాబోలు, దం డాధికారి నృపాలు
గదిసి పను ద్దెల్పు గర్భ గృహము
ఇదియె కాబోలు, శ్రీకృష్ణరాడ్విభు డోధుని
మాపి కట్టిన జయ మందిరమ్ము
అదియె కాబోలు, రా జాంతఃపురపు కన్య
లలసి నేర్చెడి మహా లాస్య శాల

కూలి కూలక యుండుట, గురుతు పట్ట
నంతగా వీలు కాకున్న, దాత్త పూర్వ
పరిచయస్థుడ నైనను; వాసి గన్న

ముప్పది నాల్గు పీఠికలమొత్తమునన్, వెలలేని శోభతో
కప్పిన, నాటి నీ బ్రతికియున్న దినంబుల; జీరువారి కన్
రెప్పల గ్రేళ్లు దాటి విహరించెదు, అప్పటి రాణి వాసపుం
గప్పుల గుంపులా, ఇవి? హా కాలినవే! ఇవియుం; బురీంద్రమా!

జిలుగు మక్కా తెల్ల చీరలు హొంగైన
మైతీవ లందు గమ్మగ జలింప
మల్లిమొగ్గల పరిమళము జిమ్మించు వా
ల్జడలు పిరుదులపై లాస్యమాడ
బాడీలు జాకట్లు పైటలు దాటి చ
న్గట్లు చాదీలపై గదను ద్రొక్క
కనుకలి మిరుమిట్లు దొనకించు తొడవుల
జిలిబిలి ధ్వనులు పాటల మలంగ

రో వెలందుకలు దసరా రోజు లందు,
రక రకంబులు మా నైన లాస్య గేయ
ములను బచరించు, ఆ రమ్యతలమటు!ఇది;
కటకటా! ఇప్పు డెమ్ముల కళ్ళ మాయె.

దసరా ప్రొద్దుల, రేడు లోక జన నీ ధామంబునన్ జేరి రా
జస మీగన్ నతు లిచ్చి వచ్చుతరులన్, స్వాముల్ పయింజల్లుపూ
లె, సగన్ రేగు సువాసనల్ నెరపు ఆ యిక్కల్ గదా ఇవ్వి? నే
డ్డీ సి! దురాఘ సనలిచ్చుచున్న వి; చెలాయించెన్; విధిధ్వాంతముల్

వి ద్యారణ్య మహర్షి వ్రాసిన, త్వ దావిర్భావపుం గుండలీ
గ ద్యోజ్జీవిక హద్దు లింత వర కే కాబోలు; ఏ మైన, ని
ర్వాద్యం బైన వెలుంగు వెల్గితివి జీవం బుండు నం దాక; ఓ
వి ద్యారణ్య పురీ! పురీంద్ర మన, నీవే సుమ్ము; విశ్వంభరన్.

పరిమితి లేని వర్తకపు భాగ్యమునన్, హరు వైన శోభతో
మురిసి జగాన గొప్ప దని పొల్చిన ఆంధ్రుల రాజధాని; లా
వరి యమదూత లెల్ల అసివారుగ ఏగెడు సీమ యయ్యె నే;
డె రుగగ రాదు కాదె! యెపుడేగతి పట్టునో; ఇంచు కేనియున్

ప్రాభవంబున దేశభాషల మాగాణి
ప్రౌఢరాయలు దున్న బంచు నాడు
ఉదయాద్రి లోనుగా నున్న దుర్గము లెల్ల
గుండరాయలు గెల్చుకొన్న నాడు
కోత కందిన తెనుంగుం జేల సస్యమ్ము
కృష్ణరాడ్విభుడు కోయించు నాడు
రాజ్య విప్లవము మూలంట మాయించి రా
మక్షితీంద్రుడు పరుల్ మలచు నాడు

శాత్ర వాసృక్ నదీ నద జలము కతన
తెనుగు పరపతి మాగాణి గొనబు మడుల
మంచి తీరైన పంట పండించి నావు
ఆత్మ జాతక యోగ ద శాత్మకమ్ము.

తురకల నేలలో విజయ దుందుభి గొట్టుచు రామరా, జవా
కరు లొనరించు ఆ సుఫల కాలము లం, దెటువంటి కీర్తితో
తిరిగితివో కదా తనివి తీరగ; నే డటువంటి నీవు, ది
క్కరి ఇటు లైతి తుట్టతుద; కక్కట! ఆంధ్ర పురావ తంసమా!

కరు వయ్యెనె సైన్యంబులు?
ఇరువది లక్షలకు దగ రహించెడి, వింకె
వ్వారి కంతటి బల మున్నది?
అరరే! దైవిక బలంబె; అరుదై పోయెన్.

ఇదియె కాబోలు, ఆంధ్ర మహీంద్ర మౌళి
ఉండు దేవిడి చేరువ నున్న నాటి
కోట లోపలి చివరి కవాట సీమ;
నవ వితంతువు లాగు, గన్పట్టు; ఇపుడు.

నిండు జవ్వనపుఁ నిగ నిగల లోన
ముద్దు లొలికించు, చా నాడు మురియు నట్టి
దండ నాథు హవేళి కాదా, ఇది? కట
తరుగు కొని పోవు, చూచు నంతకును; కడుపు.

అవు నటే! ఇది రాజ్యమందు నంతట జెలా
మణి యైన టంకాల మందిరమ్ము
కా దటే! ఇది ఖండ ఖండాంతరాలకు
సరకుల నంపు బజారు సీమ

ఇదియా! మనోవీధి నెగిరి గంతులు వేయ
దబ్బిబ్బు లాడు శాద్వల ధరిత్రి
ఇదియే కదా! బహు విధముల దృగ్జ్యోత్స్న
నాట లాడెడు ప్రజోద్యాన భూమి

నాటి ఆ శుక్లపక్ష దినాల, జెలగి
తుంచి వెన్నెల బుడమి కాపించు నీవ;
కడకు ఇట్లైతి; బ్రహ్మ లేఖకుల, కవ్వ
డిచ్చితో, లేదొ, లంచాలు; పిచ్చితల్లి!

మడుల జలమ్ము స్వచ్ఛతరమై పొడగట్టు హయామునందు, పై
పొడవున వెన్ను లీను వరి భూముల లేత పసిండి మందువా
విడుదలలో; ధమాషగ నవీన పదంబుల, బంటలక్ష్మి ఆ
డెడు, అల రత్న గర్భము లటే! ఇవి; అక్కట! చూడ లేనికన్.

తళ తళ మంచు దోరణ వద స్థితముల్ మణి రోచు, లేచి క్రో
శుల కొలదిం గ్రమించు అల శోభన వేళల, ఇంద్ర కేంద్ర ని
స్తుల పుర బాహ్య తోరణముతో జమవచ్చిన నీకు? ఈ మహా
ప్రళయ వికార రూపము! పుర ప్రథమైక కవాట దేహళీ!

సంగమాన్వయ రాజ చంద్రుల అరచేతు
లందు శైశవ క్రీడ లలరు నాడు
సాళువ వంశీయ సార్వభౌముని అంక

తుళువీయ చక్రవర్తుల బిగి కౌగిళ్ళ
నిండు జవ్వనము రాణించు నాడు
ఆర్వీటి వంశోజ్జ్వ లావనీందు్రని అంతి
పురమున కౌమార మరుగు నాడు

స్వర్గ సామ్రాజ్య పాలక పట్టణంపు
వైభవ శ్రీకి మారటవై తురంగ
లించి మించితి; వట్టి నిన్ని ప్పు, డకట!
అరయు కొలదిని, కటకట లాడు మనసు.

ఆంధ్రభాష సమస్త మైన సామ్రాజ్యంపు
వ్యవహార భాషగా బరగు నాడు
ఆంధ్ర రాట్ప్రతినిధు లై అన్య దేశాల
తెనుగు వారు యశమ్ము దొనకు నాడు
రాయచూ రాది దుర్గము లెల్ల జెలరేగి
ఆంధ్ర గజములు గో రాడు నాడు
బహామనీ రా జాది బల వద్రిపులు తెన్గు
కత్తికి హారతు లెత్తు నాడు

ఆంధ్ర పుత్రుల మైన మా ఆత్మ లెంత
మురిసి పోయెనో, ఇపు డంత పొగల వలసి
వచ్చె ఈ నాటి నీ దు రవస్థ గాంచి

తెలుగు ప్రమేయమే నెగయు దెంచని కన్నడ ద్రావిడాది భూ
ములకు, దెలుంగు బాస అతి ముఖ్య సమాదర పాత్ర భాషయై
వెలుగు దినాల, స్వైరపదవిం దులకించిన ఆంధ్రజాతి; అ
న్యుల, కిక దాసతన్ మెలగు చుండవలెం గద! ఎల్లకాలమున్.

అంతము లేని స్వేచ్ఛమెయి, ఆంధ్ర మహీపతి హస్త పల్లవా
భ్యంతర సీమలందు; అటుపై, దదమాత్య గృహాల; అంత, సా
మంత నృపాల సౌధముల; మంచిగ రోజులు బుచ్చి తింత ప
ర్యంతము: ఇంక, ముం దెటు న డాడెదవో; కవితాతలోదరీ!

మానవ జీవ నౌక కసమానపు బాటలు జూపి మంచి పే
రూనిన వేద భాష్యమున కుద్భవ భూమి; కడింది తీయపుం
జాను తెనుంగు పల్కుల మజా అసివారిన నేల; నేడు, క
ర్మాను భవాన కీ విధి గులా మయి పోయిన; దేమి చెప్పుదున్.

నవ ఖండంబుల రాజధానులు వదాన్యంబైన హోదా గడిం
చి విశేషంబుగ రాజ కార్యములలో జేయూతగా నిల్వ ఈ
అవనీ చక్రము నేలి ప్రేలున సునాయాసమ్ముగా గిల్చి స్వై
ర విహారంబుల గేళ్ళు దాటియు, దివాలా తీసె నే; డక్కటా!

# చరమశ్రీ

ఉదిలకొని కలంచు ఉల్లము సవరించి
విజయ నగరి కలిమి విలయ మగుట
విభుని సోదరుండు పెనుగొండ బొనరించె
ఆంధ్ర కేంద్ర శాస నాల యమ్ము.

తిరుమల దేవరాయ జగతీశ్వరు డీతడు, గొప్ప సాహితీ
పరుడు; కవీంద్ర కోవిద సభా పరివేష్టితు డై అజస్రమున్
హారువుగ రోజులం గడపు చాంధ్ర మహీధరణీ ప్రభుత్వముల్
తిరిగి స్థిరం బొనర్చి జగతీతల మేలె; ప్ర జానుకూలుడై.

గీతగోవిందమునకు వ్యాఖ్యాత, భట్టు
మూర్తి కవిరాజ మౌళికి పోషకుండు
వసుచరిత్రాఖ్య కావ్య సంపదకు భర్త
ఇతడు, తిరుమల దేవ పృథ్వీశ మౌళి.

పిదప, శ్రీరంగరాయలు విభుని సుతుడు
సకల సామ్రాజ్య భారమ్ము సవదరించి
పాలనము చేసె, కొన్ని సంవత్సరములు
వాఙ్మయం బన్ని ప్రాంతాల పైకొనంగ.

రాయసము వేంకటపతి, రాయన అహోబలుడు, భట్ట కాలంకుడు — వీరు, శ్రీరంగదేవరాయని ఆస్థాన కవులు. ఇందు, బైవా రిరువురు రాజకీయోన్నత పద

అటువయి, అర్వదేశమును అన్నకు మూరుగ నేలు చున్న వేం
కటపతి దేవరాయలకు, గద్దె నొసంగిరి ఊరి పెద్దః ల
న్నిట సకలాంధ్ర రాజ్యరమ నేలుటకుం దగువాడ వీవ, దోః
పటుతర శక్తి నేల మిక; పార్థివశేఖర! యంచు బల్కుచున్.

ఎన్నియొ విప్లవాలు తల యెత్తె నితండు తెలుంగు గద్దె జే
కొన్న యనంతరమ్ము; తనకుం గల ఆప్త జనంబుః లీ ధరా
భ్యున్నతి కింక, అంత్య దివసోదయముల్ చనుదెంచె నేమొ; లే
కున్న, ఇదేమి యంచు, భయ గుంభిత మానసులై చలింపగన్

నంద్యాల పురి నేలు నట్టి కృష్ణమరాజు
విభుడైన వెలిగొండ వేంకటాద్రి
దక్షిణార్కాటులో దనరు పాలెము కోట
కధిపతి యాతిరాజతని ప్రజలు

ఉత్తరార్కాటునం దొప్పు మురాసులు
మన్నెపు ల్గాచెడి మనుజ పతులు
చెన్నూరు పురికి వజీరు వేంకటరాజు
లింగమ్మ వెల్లూరి రేడు ఘనుడు

మధుర తంజావురీ జింజి మనుజ పతులు
మున్నుగా గల సామంత భూపు లెల్ల
తిరుగ బడినారు తమ ధరిత్రీశు హాక్కు
తుడిచి పెట్టంగ పెద్ద సందడుల నాడు.

ఇట్టి పరిస్థితుల్ పొటమరించిన గూడ చలింప కుండ, చీ
కొట్టి అడంచివైచె దనకుం గల శాత్రవకోటి నాంధ్ర సా
మ్రాట్టుల కృష్ణరాయలకు రామ మహీపతికిన్ సమాను డీ
దిట్ట యటంచు నర్దెస లదే పనిగా దను బ్రస్తుతింపగన్.

పిమ్మట, గోలకొండ పృథివీపతి మాళియు గూడ ఆంధ్ర రా
జ్యమ్మున కెత్తివచ్చె; అది ఆరసి ఆంధ్ర మహీంద్ర మౌళి శీ
ఘ్రమ్ముగ శత్రు దాకి సమరాన బరాజితు జేసె; స్వీయ స
ర్వమ్మును ఆజిలో విడిచి వైరి, హుటాహుటి పారి పోవగన్

ఆవిధి, గోలకొండ వసుధాధిపు నోంచియు దాళికోట యు
ద్ధావసరంబునన్ రిపుని హస్త గతంబయి చీలియున్న ఆం
ధ్రావని భాగముల్ తిరిగి ఆంధ్ర ధరిత్రికి జేర్చె; తొంటి సు
శ్రీ విభవాలు వెండియును జేబుకొనంగ తెలుంగు భూములన్.

ఏమాత్రింబో కొరంతగా, సకల వ్యాప్త త్తాంధ్రసామ్రాజ్యపున్.
భూముల్ వెండియు గెల్చి ఏలిన మహా భూపాలుడీ రాయ; తె
నోష్మై ల్లావల నున్న యూరపు ధ రానూన ప్రజా హృద్గృహా
రామ శ్రీలకు గూడ బ్రాకినవి; ఈ రాజేంద్రు కీర్తి ప్రభల్.

అంతము లేని కీర్తి గలట్టి మహీపతి రాజకీయ భా
స్వంతుల లోన అక్బ; రటువంటి మహామహుడే; తెలుంగుభూ
కాంతుని వీని ఊహల వికాసము లోపల దెల్ల బోయి భా

అంతటి తెల్వి తేటలు గల్గి మహీపతివాళి ఈశ, డ
క్రాంతభుజా బలంబు మీఱు చంద్రగిరిన్ బెనుగొండ వెల్గుచిన్
స్వాంత ప్రభుత్వ కేంద్ర నగ రాభరణంబులుగా బొనర్చి ఆ
శాంత మహాంధ్ర రాజ్యరమ నంతయు నేలె; లస ద్యశస్వియై.

చక్రవర్తికి గురుస్వామి తాతాచారి
గ్రథనమ్ము లొకవంక కసిమసంగ
అతి నిరంకుశుడైన చతురుడు రామలిం
గని ఘంట మొకట గర్జనలు సలుప
మంత్రాంగ విదుడైన మట్ల అనంతుని
లేఖిని ఒకవంక శాఖ లీన
అతుల పాండిత్య సంగతుడు అప్పయదీక్షి
తుని వ్రాత లొకట చిందులను ద్రొక్క

ఎందరెందరో ఇంకను ఇతర బుధులు
కవులు స్వేచ్ఛా విహార శంఖంబు లూద
తెనుగు దర్బారు నవ నవ్య దీప్తి దొనకె
వీని స్వామిక తపనీయ వేళ లందు.

పదపడి, గండికోట నరపాలుడు కృష్ణమరాజు కొల్వు నా
స్పదముగ జేసి ఆత్మ నవభావ తరంగిత భారతీ లస
[illegible] బచ్చారు లొనర్చి అనంత కీర్తి సం

అంతియే కాదు, నాఁటి భాగ్యం బదేమొ
వేద వేదాంగ బహు వాగ్వివాద సభల
బాలు గొనుచుండె అనిమిష భాష లోన
ఎంత పండితుఁడో! మహీ కాంతు డితడు.

వేంకటాంబ, రాఘవాంబ, పెద ఓబాంబ, పిన ఓబాంబ, కృష్ణాంబ, కొండాంబిక: ఈ ఆరుగురు శ్రీ మద్రాజాధి రాజ, రాజపర మేశ్వర, శ్రీ వీరప్రతాప, వీరవేంకటపతి దేవరాయులకు ధర్మపత్నులు.

అయినను, రాజరాజునకు ఆంధ్రుల దుర్దశ జేసి సంతు సుంతయి నుదయింప దాయె, వసుధా పరిపాలన భార మూపయింబయికొని నిర్వహించుటకు; ప్రాజ్య త్రిలింగ ప్రభుత్వలక్ష్మి ప్రశ్రియమును సన్నగిల్లె నన జాలును బో; ఇక, తెన్గు గడ్డపై.

అది యొక గొప్ప లోటుగ, ధరాధిప చంద్రుని పెద్ద భార్య నె
మ్మది కగుపించె; ఆ సమయమందు ఒకా నొక విప్రకాంత నె
మ్మదిగ త దాప్తురాలు గల మందిర భూమికి వచ్చి: నెచ్చెలీ!
హృదయపు బెంగ నింక త్యజియింపుము;నీకొక మాట, జెప్పెదన్.

సంతు కోసమ్ము బెంగ లేశమ్ము గూడ
వలదు; నెల తప్పినది నాకు ప్రస్తుతమ్ము
శిశువు జన్మింపగనె నీదు చేతి కిత్తు
కనుక, నటియింపు మీవిక గర్భవతిగ.

అనిన విని, వెంకటాంబిక అంతు లేని
హర్ష నక్షత్ర శిక్షి విహార మొలసి
నెచ్చెలిం జూచి: ఇది నేను నీవు దక్క-
ఇతరు లెరుగని రీతి జరింపు; మమ్మ!

అని, తన బ్రాహ్మణీ సఖిని అల్లన బైటకు సాగ నంపి గ
ర్భిణిగ దదాది దాను పచరింపగ దక్కెను; అంత, భూసు రాం
గనయును మాసపూర్తి అవగానె సుతుం గని రాణి కంద జే
సె నతి రహస్య భంగి; హరుసించి కురంగటి భామ, లా పయిన్.

మా దొరసాని చక్కని కుమారుని గన్నది, యౌవరాజ్య సం
పాదక భాగధేయములు పట్టిన వానిని నేటి ప్రొద్దు; ధా
త్రీధర మౌళి కీ శుభ పరిమళ వార్తనెరుంగ జెప్పి ఆ
మోదము సేయరే? యనుచుపుచ్చిరినాకరులక్;ద్వరాత్మనై

యౌవన మేగ, పశ్చిమ వయస్సున నున్న పడంతి, సంతతి
శ్రీ విభవమ్ము గాంచె నని చెప్పిన నమ్మగ రాదు; నమ్మకం
బోవగ రాదు దైవిక విభుత్వము నెంచిన; యంచు నెన్నియో
భావము లుద్గమించినవి పట్టణ వాసుల; కంత టంతటన్.

ఇంతయు, నాత్మలో నెరిగియే; జనపాలుడు, భార్యమీది కొం
డంతటి ప్రేమ నేమనక ఆత్మజు జన్మ దినోత్సవమ్ము ల
ల్లంతన, రాజ్య మంతట నెలర్పగ గట్టడులం బొనర్చె దు

అంత, వానిని జిక్కరాయలుగ జేసి
ఈడు దొరబడగానె, రచించె వడుగు
పెండ్లి మున్నగు వేదోక్త విధుల నతని;
కాత్మ వల్లభ నలరించు కడక; నతడు

ఇంత రచించియున్, వసుమతీశ్వరు, డా యువరాజు నొక్కచు
ర్గాంతర సీమకుం బనిచి గౌరవ బంధితు జేసె; వాని వి
క్రాంతి స్వకీయ విక్రమ సురక్షిత భూ విభవాల, కెట్టి ని
ష్క్రాంతియు సంభవింపని నికామ వరిష్ఠ పథ ప్రరోచులన్.

కాలము కొంతమట్టుకు బొకాలిన ద; ట్లటుపైన, మేదినీ
పాలక మౌళి మంచమునుబట్టె రుజా గతుడై; తెలుంగు వి
ద్యాలతకుం, దెలుంగు కవి తారమకుం, దెలుగుం బ్రభుత్వపు
శ్రీలకు, ఇంక, "ఏ మొదవు చేపమునో" యని పృథ్వి జంకగన్.

ఇక, జీవించుట తోచ దీ రుజ సమీక్షింపన్;మహీ పాలనా
త్మక భారం, బిపుడే మ రొక్కని భుజా దండంబునన్ బెట్టినన్
సుక; మంచుం దన సోదరీ సుతుని, దక్షుం, జిక్కరాయప్రభున్
వికస న్నమ్ర ప్రవర్తనుం, బిలువనంపెన్ దత్క్షణం; బొక్కనిన్.

మామ కృపామయుం బగు నిమంత్రణమున్ శిరసావహించి త
ద్ధామము జేర రా, సతడు, దక్షిణ హస్తము నెత్తి: రాజ ము
ద్రా మహితంపు టుంగరము, దారక! ఇయ్యెద; దీని దాల్చి ఈ

పలికెనో లేదో రాజటు, గుభాలున, వాని మనస్సు నిల్వనక్
గలగె; శరీరము తటను గంపము పైకొనగా దొడంగె; మా
టల దడ బాటు పుట్టె; కిరటాలుగ నశ్రుల వెల్లి పొంగుచుం
జల జల బారె, గంటి తెరచాటున; దోచెను, స్వేదబిందువుల్.

దానికి, నెమ్మనంబుల నితాంత పుటచ్చెరు వొందు చున్న సే
నానులు మంత్రు లాది గల నాయకు లెల్ల మరింతగా వితా
కూనగ; ఒక్క పెట్టున, బ్రభూత్తము పాదము లాని వా, డదే
ఘ్యానముగా, ధరిత్రి పల దంచును వచ్చె; ముఖమ్ముజూచుచున్.

అటు, తన కాళ్లపై బడి నిరంతర దుఃఖపు టశ్రు బిందువుల్
బొట బొట కార నేడ్చెడు ప్రభుర్ బయికెత్ గొని లేవదీయు, జెం
గటి దొరలన్ బురిం గొలిసి; క్రమ్మర, ఆంధ్ర మహీంద్ర మాళిదృ
క్తాంచముల దృశ్కాలం జొనిపి దక్షిణ హస్తము నెత్తె; మెల్లగన్.

ఛాచరికమ్ము గొన్న, దన లావును ఎట్టి విపచ్చ లాటువుల్
కాచితలిర్చి ఏచి అరి కట్టునొ యున్న భ యమ్ము చేత సం
కోచము జెందు చుండ, గయి కొ మ్మని దగ్గరి వార లెల్ల బ్రే
రేచిరి: దాన, ముద్రిక ధరించెను రాట్సుతుం; డెట్టి కేలకున్

నా తరువాత, ఈ పరగణాలకు ఏలిన మీరా లందున్ ద
నేకగ భక్తులై పరిగణింపుచు బట్టము గట్టు; డంచు, ఆ
ఖ్యాతము సేసి తెన్గుపడికారపు పంటయు, తెన్గు స్వేచ్ఛయున్

అంత, శ్రీ రంగరాయ నా మాంతరమున
బరగు చిక్కరాయలను సంప న్మహాంధ్ర
సర్వ సామ్రా జ్య భూమికి సార్వభౌము
జేసి; రచ్చటి పెద్ద వజీర్లు కలసి.

దానికి, కొంత మంది బహుధా హారుసించిరి; కొంద, రీర్ష్యలం
బూనిరి; ఇంక, కాల మెటు పోయి ఎటుల్ చనుదెంచునో అటం
చా నవ చక్రవర్తి తన యాప్తుల జేరువ నుంచి, దుర్గసీ
మానము చాట గొల్పి అనుమానము కల్గిన వారి, నందరిన్.

అగ్ని కాద్యము తోడగు నట్లు, లపుడు
మనుమనికి భూమి రావలె ననుచు బెనగు
జగ్గరాయుని కుటిలపు జతన ములకు
బలము చూపించె; ఆ వైర భావ చేష్ట.

కోట వెలువడి నట్టి ఆ కుటిల దండ
నాయకుల గుంపు సర్వమూ, నాటి నుండి
జగ్గరాయుని తరుపున సార్వభౌము
కూల ద్రోయం బ్రతిజ్ఞ గైకొనిరి; బలసి.

వాలు మగంటిమిం గలుగు పార్థివ చంద్రుడు మేనమామ, ఈ
పాలన భార మంతయును, వ ద్దను చున్నను పట్టు పట్టి తా
నేలూకొ నాశిరమ్ము పయి నెట్టుట? అ ట్లొనరింప కున్న, తాం
తాళ మెసంగ కుండును గదా ఇపు; డీ పలుగాకి మూకకున్.

అని, ధరణీశ్వరుండు హృద యాకలనమ్మున బ్రొద్దు మాపులుం
దొణికిస లాడు చుండ; అట, దుర్నయు లాతని ఆధిపత్యముగా
జెనకి తలంగ జేయు కను జీకటిలో నెమరీదు చుండి ర
ల్లన; గుటిలంపు టూహాల వలంతి స్రవంతి బెనంగు లాడుచున్.

అంతకు మున్ను కప్పముల నన్నిటి మానిన వార లెల్ల: అ
ర్పింతుము, మీకు రా దగిన విప్పుడ పూర్తిగ; ఆజ్ఞ యైన, ద
ర్శింతుము; పూర్వ వైరముల నేమరి మమ్మ ననుగ్రహింప, నా
శింతుము; విన్నవింతుము విశేషములం; దమకొల్వుముంగటన్

అని; ఒక అర్జీ పత్రము
అనిపిరి రారాజు కడకు; అది, కని రేడుగా
మనమున నిజ మని నమ్మచు
అనుమతి బంపించె; గోట కరుదెంచంగన్.

అదె నృపు బట్టగా సమయ మంచు జొరం బడినారు లోన, నె
మ్మదిగ స్వసైన్యులై పొలికి మార్పుచు గావలి వాండ్రవారు; అ
య్యది గమనించి ద్వారముల నన్నిటి వెంటనె మూయు, ఆజ్ఞలం
పె ధవుడు; కాని, లాభమగుపించదు; కాలము మించిపోవుటన్.

కొంత కొరంతగా, తమకు కోట సమస్తము చిక్క; అంత నీ
వింతట: దుర్గమున్ విడిచి యేగుము బైటకు; ఏగుదేని, ప్రా
ణాంతక మైన ఆపదకు అగ్గము కాకయె ఉండవచ్చు జీ
వాంతము, వేమికొనుతీ హితాప్తులముంగట హాయిగా; నృపా!

అని, అల యుండగేంద్రు కబురంపిరి; అయ్యాది చూచి లేదు, చే
యున వెదియుం గనంబడమి, ఉత్తలపాటున గోట వీడి పో
యెను స సతీసుతంబుగ; అదేమొ! ఒకండును గూడ, లేనికిన్
నెనుకటి మాదిరిన్ వినతి పెట్టడు నా; డటు పోవు చుండగన్.

ఆ గతి సర్వమున్ విడిచి ఆవలకుం జనుచుండ, చుట్టునున్
మూగి అరెస్టు చేసి కొని పోయిరి వానిని, వారు బంది ఖా
నా గదికిన్ సతీసుత జనంబుగ; బట్టను గట్టి రా పయిన్
ప్రూగిన పెద్ద తొంటి యువరాజున; కెంతటి ఘోరకృత్యమో!

అందరు కూడి ఏకమయి ఆవిధి నాతని క్రిందు మీదు సే
యుం; దుద కొక్క సైనిక దళాగ్రణి మాత్రము విప్లవాన పా
లందక; రాజభక్తుడయి అప్పటి ఆ దురవస్థ నుండి రా
జ్యేందిర గ్రమ్మరించి ఎసగింప, బ్రతిజ్ఞ వహించె; గట్టిగన్.

ఏచను నాయకుం డనా,అహీన పరాక్రమ శాలి ఆత; డా
నీచుల నుండి తొంటి ధరణీ పతి వెల్వడ జేయు టే, ప్రధా
నోచిత కార్య మం, చరసి ఊరక ఎత్తుల పైన ఎత్తులన్
వైచుచు నుండె: కాని, నెరపన్ గను పింప దుపాయ; మెద్దియున్

ఎత్తుపై యెత్తులన్ వైచి ఇపుడు లేని
ఖైదు బాపుట కూహించు కడక కంటె
అతని పుత్రులలో నెవ్వ నైన ఒకని

అని ఆలోచన సేసి; బంధన గృహం బం దున్న, శ్రీరంగరా
యని పుట్టంబులు బాగుచేయు రజక వ్యాపారు రప్పించి: భూ
పునకీ లేఖను జూపి, త త్సుతుని తెంపుం బెంపు గావించి, తో
డ్కొనిర మ్మొక్కొని; మంచికానుకలునీకున్ముట్ట చెప్పించెదన్.

కొని వచ్చు నప్పు డెవ్వరు
కను గొనని రహః ప్రతోళికల గను మని లే
ఖను ఇడి పంపిన, చిత్తం
బని వాడును కులుకులురల, నావల కేగెన్.

ఊరక లేదు నాడు మొద లొక్క నిమేషము కూడ వాడు, రా
ద్దారకు నప్పగించెడు ప్రధానపు బెత్తుల గాక; ఒక్క నా
డా రజకుండు, మంచి సమయంబును జూచి తదుత్తరమ్ము శ్రీ
వారికి చేతికిచ్చి ఫలవంత మొనర్చెను కార్య; మంతయున్.

ఆవిధి చాకలి తెచ్చిన
భూవిభు సుతునూది ప్రభువు తన పూనికకుం
జేవ ఘటిల్లె న టంచును
భావ స్వాతంత్ర్య నౌకపై విహరించెన్.

రాయనిపుత్రు డొక్కడు చెరం బలకించి చటుక్కునన్ బరా
రాయె; నికన్ బ్రతీపవసుధాధిపుపన్నగడల్ ఫలించు; గ
ట్టా! యని జగ్గరా జటమటంబడి బిట్టు అలందురెన్, మనః
స్థాయిదలంగి; రాజును, బదంపడి మార్చెమరొక్కచోటికిన్.

ఘూరిచి, ముందు కంటె అతి మాత్రము జైలున గట్టుదిట్టముల్
గూరిచె ఊరబోక; అవి కూళటి వ్రేళ్ళను పెల్లగిల్లు న
ట్లారయు చుండె ఏచమ దళాధిపు; డేవిధి నైన, ఆంధ్ర ల
క్ష్మి రమణీ ధ్వజమ్ము బయికెత్త దలంచిన వాడుగావునన్.

తనకు, విశ్వాస పాత్రులు తన దివాణ
పుం జవానుల గొందరి బోగు చేసి
"రాజు చెర బాప వలయు ఏలాగు నైన
మీర" లని, వారి నాతడే తేర బనిచె.

పనిచిన వెంటనే చనిరి వారును, ఏ యెడ రాజ రాజు జై
లున బడి యుండెనో అటకు, లోగడనే అల జాడ లన్నియుం
గనుగొని; అంత, జైలు నధికారి గృహంబున భృత్య వర్తనన్
దినములు బుచ్చుచున్, సమయదీక్ష మెలంగుచునుండి; రందరున్.

అంత, దమ కను వగు సమ యమ్ము జూచి
బ్రహ్మ కేనియు తెలియనిభంగివారు
కంద కమ్మును ద్రవ్విరి ఖైదు గదికి
సూటిగా అంచనా వైచి, జడిగి జాగి.

దాని వెంబడి, రేడున్న తావు జేరి
భక్తి జాగిలి మ్రొక్కి: దేవా! త్వదీయ
శ్రేయముల్ గోరు ఏచమ నాయకుని జ
వానులము; వచ్చితిమి దొరపనుపు జేసి.

వచ్చిన వారి నెల్ల, దెలి వాలిక కన్నుల పార జూచి; స్వ
యోచ్చిత గోరు, ఏచముని ఉత్కట దీక్షను నచ్చి; దైవమున్
మెచ్చి; "ఉపప్లవం బిక, శమించెగదా" అని, నిమ్మళించి; పై
పెచ్చుగ పొంగి పొర్లెడు, నవీన మన స్స్మృతి దోగ రా; జటన్.

ఒక సామాన్యపు నౌకరుల్ పరుల సాయుజ్యం బొకింతేని గో
రక యే, సర్వము నిర్వహించితిరి మీరల్; ప్రాభ వోద్యోతిత
ప్రకటశ్రీ గల, మమ్ము బోంట్లకె దురాపంబైన కార్యమ్ము; సా
ర్థక జీవుల్ గద! మిమ్మువంటి పనివాండ్రుం గొన్న భూమీశ్వరుల్

అని, హారుసంపు మాటల విహార మొలర్చుచు రంగరాయనిం
గని: యిక, దాము మా వెనుక కాల్నడ రం;డిది, మా ప్రభుండు పం
చిన పను; పాలసింపకుడు; శీఘ్రము రెం; డిటుపైన, గాలయా
పన మయినం బ్రమాదము;నృపా!యని వారలు తొందరించినన్.

ఇప్పుడే, మిమ్ము గూడ రప్పింతు; సంత
పరశు, నిర్యోడ మొలగుడు భద్రముగ; న
టంచు, దన యాలు బిడ్డల ననునయించి
తెనుగు బిడ్డడు తెగి బయల్దేరి వెడలె.

అట్లు సురంగ మార్గ గతుడై చనుచుండ, జవాన్లు చూడ్కి వా
ల్దోట్లకు జిక్కిపోయి, వసుధాపతి, ముందటి కంటె నెన్నియో
రెట్లధికంపు బాధల గురిం బడిపోయె; అదృష్ట రేఖ చీ
కట్ల మలంగు న; ట్లైపరు గల్గిన నేమి? అగమ్య మంతయున్.

ఆ విషయమ్ము లేఖలు బయల్పరచన్ విని: ఇంక, గించి దు
చ్ఛావచ సర్వ నాశనము జల్పక వీని నుపేక్ష చేసినన్
భావి నుపద్రవమ్ము ప్రభవం బయినన్ అవ వచ్చు నష్ట పా
ల్యావని; కంచు, జగ్గవను ధాధిపు డాత్మ దలంచె; ఉగ్రుడై.

తలచిన తత్క్షణంబ, నవ ధాత్రిపు బేరిట నాజ్ఞలంపె: ఉ
త్తలముగ, వాని వాని సహధర్మిణి, వాని కుమారికాకుమా
రుల, నలుసంత యైన, బుయిలోడక పట్టి సమాప్తి సేయగా
వలసిన దంచు, జైలుదళ వాయికి; ఎట్టి కసాయియో కదా!

అనిపెనో లేదో అనలటు; లా క్షణమే, నరికించి వైచె జై
లున గల నాయకాగ్రణి, అలోమని ఏడ్చెడు చంటిపిల్ల లం
గనల యుతంబుగా వెలుగు కాంతు, నొకింతయు జాలిలేక; మో
కున బగియించి గొంరెలను గోసెడు పచ్చి కసాయి కైవడిన్.

ఇకపయి, హాయిగా మనసు డీ యధిరాజ్యము నేలవచ్చు శ
త్రుకులము మాసె గాన, అకుతోభయ మానసుడై అటన్నన
మ్మిక నతడుండగా; బయుట మేటి పుకారుజనించె: దుంపత్రెం
పక విడడింక, ఏచమ నృపాగ్రణి యంచు; మరింత కుందగన్

అట్లు వదంతి పుట్టె; నిటులప్పుడ, ఆతని నుండి ఉన్న దు
న్నట్లుగ వచ్చె వార్తయు: ధరాధిపు, వానికుటుంబమున్, జెరం
జెట్లె వధింప జేసితి; వినీ! ఒకయించుకయు బాపభీతి లే
కెట్లు; నరుండవో, దయ పోకాలిన దైత్యుడవో, మహీశ్వరా!

శ్చి మహీశ్వరుం; డతని సంతతి చచ్చె; దతీయ పత్నియుం
చ్చెను నీకతంబున, విశాంపతి! ఇంక, ననుం, మదీయ బా
బాచ్చె యుద్ధైన; లేని సుతు నుక్కడగింపుము; తెన్గు రాజ్య సం
ద్చయ మెల్ల, ఏలుకొన వచ్చును హాయిగ; సర్వదిక్కులన్

ల్లుడు నీకు, నాకొ హితు, డా చనిపోయిన రాజరాజు; భూ
ల్లభ! ఇందు, నీకు గల బాధ్యతయే గణుతింప గొప్ప దీ
ల్లవు కాని, ఆతని మ హోన్నతి నిల్పగ; అట్టి నీవ, ఈ
ల్లరి నెల్ల నాయకుడనై నడిపించెదు; డెంద మొప్పెనో!

ౌతికి నన్నాళ్లు బ్రితుంక ప్పైన; అట్టి
తుది వయస్సు నం, దిట్టి ఆత తాయి
నుల దెగబడె; దెద నిహ పర మనీష
లదొ లేదో ప్రభూ! నీకు; తెలియు; దకట!

టు బరికించినన్, బరిగణింపగ జాలని ద్రోహి వైరి, వేం
టపతి సార్వభౌమునకు క్ష్మాస్థలికిన్; క్షమియింప జెల్ల దిం
టు నిను; వృద్ధరాజ! సరదాపడి యుద్ధమె సేసెదో; మహిం
టుకున ఒప్పగించి జనసంతతి గాచెదొ, తెల్పు; మేర్పడన్.

గడ మొనర్చి ఏచముని చంపుటయో, కికురించి స్వీయ ప
గు నొనరించుటో, ఎదియొ, సాగియొ, యుండెడి దింతవట్టు గ
గ నిటునైపునిల్పి పురడించిన ఆదొర లిప్పు డన్య ప

ఎవ్వరో యొక, రిల మొగరించి పిలు
కొనిన పలుకో నిక; ఈ గొడవ తెల్ల,
పెనిచి అంతటి సార్వ భౌమునకు మామ
నయ్యె; ఆఖర కవకీర్తి గగ్గ నైతి.

పరి పరి విధముల నందురె,
నరపతి ఇమ్మాన్మదీక్ష, నైరి నాయకు డా యు
త్తర మంప; విదప, దా ని
బ్బరముం గొని ఇట్లు కొంత నడి యోజించెన్.

కోరినదిత్తు నన్ను నెను కో మ్మని కోరిన, సమ్మతిన్ దరిం
జేరునొ; లేక, దర్శనము చేయుగ రాని మ హోగ్ర మూర్తియై
ఊరక మారి పోయునొ; ఎవో, ఒక డా గద రెంటు; ఇంక, వ్యా
పారము చేసి ఇట్లు లొక వార్తను బంపెద; జూచె; దా పయిన్.

అని, జగ్గరాయ లేచను
జనపతికిన్ దెలిపె హృదయ సర్వస్వం; బా
యన, అది కని మది నెంతే
గినిసి ఇటుల్ జవాబొసంగె; కిమ్మనకుండన్.

లేని పోని దు రాశల నూని నీవు
గప్పి తిన్నదె కాక; సి గ్గరి ప్రయత్న
పూర్వ కంబుగ నన్నును ప్రోత్సహింతు

ఇపుడు మదీయ రక్షణ రహించెదు ఈ పసి కూనయో, మహీ
విపుల త్రిలింగ రాజ్య పదవీ గ్రహణార్హుఁడు; హాని దక్షుఁ డీ
విపుల మరొక్కనిన్ బడయ నిలుగునా? ఎవ రేమి చెప్పినన్
జెప్పుదురు గాక: ఏచముఁడు చేకొన; డింక, మహీంద్రుఁ డీతఁడే.

న్యాయము పంపు సేయదు రసంతయు, ఇట్టి కుతంత్ర బుద్ధిక
న్యాయము కాని; వృద్ధ నర నాయక! యైన, దెలుంగు విస్తర
శ్రీయిది చక్రవర్తి సుతు జేరమి; కేచముఁ డేమి యయ్యో! లే
డా, యిల! రాజ రాడ్గృహ శిఖావన కంకణ బద్ధ హస్తుఁడై.

కొనల సమర్చి ఏచముడు మోహారమున్ బ్రకటించు నేని, ఆ
తని నెదిరింపగా దగిన తాలిమి లేదు; పరిస్థితుల్ రణాం
బున కెర గాక పూర్వము, ప్రభుత్వపు జోక్యము పెటిబుచ్చగా
మనసు తెగింప దా ముసలి మానిసి; కిం, కత డేమి చేయు బో.

పోరిత మాడకే, ఉరక భూమి గడించిరె? ఎన్నడేని సత్ప
ధ్వీరమణుల్; ప్రశాంతి పరివీత వచస్సుల వాడు కింతయున్
దారికి రాడు; యుద్ధ మిక తప్పమియే ఎద దోచు, వాని వా
గ్ధోరణి చూచినన్; ముసలి తొత్తున కింత ప్రలోభ మెందుకో!

అని రణంబున కవహితుఁడై సమస్త
బలములన్ గూర్చి ఒక శుభ వాసరమున
ఏగె దం డెత్తి వృద్ధ రాజేంద్రు పైకి

అప్పుడు, రిపుని రాక ఆకర్ణించి ప్రతీప
దెత్తి వచ్చు యుద్ధ వృద్ధిఁ గంత
రెండు మొనల మధ్య మొం డైన జగడమ్ము
రేగి కొంత వరకు సాగ నట్లు.

బవరము జరిగిన కొలఁదిని
అవితథముగ నస్మదస్త్ర మవ సాగను శా
త్రవ జాతీయ పతాకా
వ్యవకలితా దభ్ర బల సు హార్ద్బుల జాడల్.

ఏచమ నాయకుం డది గ్రహించి మరింతగ నెంబడింప, ఆ
రేచిత సత్త్వుడై తుదకరీంద్రుడు పొంచి పరారి యయ్యె కా
ర్యోచిత లెక్క సేయక; మహాంధ్ర మహీతల రాజ్యలక్ష్మి, వ్యా
కోచ విలోకన ప్రభలు గొం డొక సేపు నిగిడ్చె; రేనిపై.

ఉపనత మైన ఆత్మ విజయోత్సవమున్ బ్రకటించు మంగళా
లపకము వాద్యముల్, పలు తెరంగుల మేల్కొలుపుల్ పఠింపగా
నృపతి మనస్వితా ప్రబల నిద్రను మేల్కొని, శోచి రుజ్జ్వల
స్నపిత విలోకనంబుల దిశల్ గనియెన్; ముద విహ్వలాత్ముడై.

కటకట లాడినయ్యెన, దుద కాంధ్ర ప్రభుత్వ కిరీట లక్ష్మి దో
ర్లిలి నృపు వంగడాన ఒనరింపగ జాలితి; నాకవాసి వేం
కటపతి దేవరాయల కఖండ మనఃస్థిమితమ్ము గూర్చితిన్

తన తలపెట్టి నట్టిది యథా విధిగా నెరవేరగా, అతం
డనుపమ హర్ష వార్నిధి దయా రయి నిల్చిన మానస సైకతా
కను గాని; తన్మయోపచిత గంధ వహా క్వణ దూర్మి వీధులం
దున, విహరించె న; ట్లల ప్రదోష హిమాంశు హాస స్మరీచులన్.

అప్పు డొక మంచి రోజున, మహా మహులు డా దళవాయి, సర్వ భూ
నృపతుల ముంగటన్, తెలుగు నేలకు ఆ కడగొట్టు బిడ్డనిన్
నృపతి నొనర్చి; ఆంధ్ర మహా నీయుల, కంతియు కాదు, సత్పథ
స్నపితుల కెల్ల, పూజ్యుడయి నా;డశేషము తపం బొనర్చెనో!

అతడు, తెలుంగు రాజ్య రమ నంతయు నేలిన రంగరాయ భూ
పతి; తన దేశమందు దమ వర్తకముల్ నడిపించు కొంట కా
నతి కయి వచ్చి వేడు కొని నట్టి బ్రిటిష్ ప్రజ, కాదరించి స
మ్మతి నిడినట్టి ప్ర ప్రథమ మానవ ముఖ్యుడు; భారతావనిన్.



## శాంతిసమరము

ఇదిశతావధానులు సత్యదుర్గేశ్వర కవులచే రచింపబడినది; రాజకీయ మగు ఏకాంకిక — నాటిక. ఇట్టిది మన ఆంధ్రభాషలో లేదనియే చెప్ప వచ్చును ఆంధ్రవాణి పత్రికలో ఇది ఇంతకుపూర్వము వెలువడినదే. ఇప్పుడు పుస్తకాకృతి ప్రకటితమైనది. ఎంతసేపూ ప్రేమికాప్రేమికుల కట్టుకథలతో వినుగెత్తియున్న ఆంధ్రహృదయములకు ఇదినవ్యతనూ, దేశ భక్తినీ, దేశసేవనూ పురికొల్పుటకు సమర్థమైయున్నది.

భారతి-1940-నవంబరు

## రత్నేశ్వర ప్రసాదనము

ఇయ్యది శ్రీగురురామకవి సంస్కృతమున రచించిన నాటకమునకు శ్రీసత్యదుర్గేశ్వర కవుల ఆంధ్రీకరణము. శ్రీసత్యదుర్గేశ్వర కవుల తజ్ఞ మాయుం మాతృకపాంకము చెడకుండ గావింపబడినది. సిద్ధహస్తులు మరి యెక్కు గావింతురా?

త్రిలింగ-11-ఫిబ్రవరి-1946

## ప్రణయస్వైరిణి—

లో చంద్రగుప్తమౌర్యుని వివాహమాడిన హెలీన ఎట్లు తన ఊహా ప్రపంచంలో స్వైరాభిలాష నాశ్రాయం విహారముల నోలలాడుటకు అను వైన సుమమార్గ మేర్పరచుకొన్నదో శ్రీసత్యదుర్గేశ్వరకవులు ప్రాచీన భాషాలక్షణబంధములకు దాసులుగాక స్వేచ్ఛగా తమకవితాధార సాగించారు.

సంపాదకీయ విమర్శ.

## భావలహరి

రచయితలు, సత్యదుర్గేశ్వరకవులు. ఇది ఖండకావ్యము. అయినా రచన నవీన పంథానే నడచింది "ప్రబోధము" లోని ఈక్రింది పద్యాలు ప్రాచీన భారత ప్రతిభను చక్కగా చాటుతున్నాయి... ..."ఈనాటి అమెరికా భూమియైన నిలవజాలునె నాటి వెన్నెల దినాలకి?"

"కవీ" అని సంబోధిస్తూ రచించిన "కాళిదాస స్తుతిలో" ప్రపంచ ప్రఖ్యాతిగన్న నాటకకర్త తన జీవితాన్ని రచించుకోలేదేమో! అనే విచారాన్ని వెలిబుచ్చిన కవికుమారుని "సుంతయైనను మా సూని సూచనట్లు ఆత్మకథ వ్రాయవైతి కదా" అన్న పలుకులు చదివి అతని కవితాప్రవాహమందు విహరించు శుభసమయములందు కన్నీరు కార్చని వారెవరు? "క్షామ పిశాచిని" బొమ్మని అదలించే కవికుమారుని ధీరత్వము "కవిః నిరంకుశః" అన్న లోకోక్తిని నిరూపించుకొన్నది. "పెండ్లి కొడుకు" "అత్తింటికోడలు" మొదలయిన సాంఘిక రాజకీయ సమస్యలు—"జగపతిఖడ్గమా!" మొదలగు క్షాత్రవీరుల చరిత్రలు చదువరుల రక్తనాళాలలో మరుగు పడిన శౌర్యాగ్నిని రగులు కొల్పుతాయి.

శ్రీ హరికృష్ణ
శ్రమజీవి
రాజమండ్రి

## రమాదేవి

ఇది సుప్రసిద్ధులగు శతావధానులు సత్యదుర్గేశ్వర కవులు రచించిన అయిదంకముల నాటకము. కథాసందర్భమున భారత దేశాభిమానము స్త్రీ విద్యావిషయము అను గుర్చిన ఉద్బోధనలు కలవు. కవిత, కథాగమనము రసవంతములుగా ఉన్నవి.

గోలకొండ పత్రిక

